# పుష్ప విలాపం

నీ పూజ కోసం పూలు కోసుకొద్దామని పొద్దున్నే మా తోటలోనికి వెళ్ళాను ప్రభూ ఉదయశ్రీ అరుణారుణ కాంతులతో ఉద్యానవనం కలకలలాడుతోంది పూల బాలలు తల్లి ఒడిలో అల్లారు ముద్దుగా ఆడుకుంటున్నాయి అప్పుడు

నేనొక పూల మొక్క కడ నిల్చి చివాలున కొమ్మవంచి

గోరానెడు నంతలోన విరులన్నియు జాలిగ

నోళ్ళు విప్పి మా ప్రాణము తీతువాయనుచు

బావురుమన్నవి కృంగిపోతి నా

మానసమందేదో తళుకు మన్నది పుష్పవిలాప కావ్యమై

అంతలో ఒక సన్నజాజికన్నె సన్నని గొంతుకతో నన్ను చూసి యిలా అంది ప్రభు

ఆయువుగల్లు నాల్గు గడియల్ కనిపించిన తీవతల్లి

జాతీయత దిద్ది తీర్తుము తదీయ కరమ్ములలోన

స్వేచ్ఛమై ఊయల లూగుచున్ మురియుచుందుము

ఆయువు తీరినంతనే హాయిగ కన్ను మూసెదము

ఆయమ చల్లని కాలి వ్రేళ్ళపై

ఎందుకయ్యా మా స్వేచ్ఛ జీవనానికి అడ్డు వస్తావు మేము నీకేం అపకారము చేసాము

గాలిని గౌరవింతుము సుగంధము పూసి

మమ్మాశ్రయించు బృంగాలకు విందు చేసెదము

కమ్మని తేనెలు మిమ్ముబోంట్ల నేత్రాలకు హాయి

గూర్తుము స్వతంత్రులు మమ్ముల స్వార్ధబుద్ధితో తాలుము

త్రుంచ బోకుము తల్లికి బిడ్డకి వేరుచేతువే

యింతలో ఒక గులాబి బాల కోపంతో

మొగమంతా ఎర్రబడి యిలా అంది ప్రభూ..

ఊలు దారాలతో గొంతుకురి బిగించి గుండెలోనుండి

సూదులు గుచ్చి కూర్చి, ముడుచుకొందురు ముచ్చట

ముదుల మమ్మ్మ అకట దయలేనివారు మీ యాడవారు

పాపం మీరు దయాదాక్షిణ్యాలుగల మానవులు కావోలునే

మా వెలలేని ముగ్ధసుకుమార సుగంధ మరంద మాధురీ

జీవితమెల్ల మీకై త్యహించి కృశించి నశించిపోయే

మా యౌవనమెల్ల కొల్లగొని ఆపై చీపురుతోడ చిమ్మి

మమావల పారబోతురుగదా నరజాతికి నీతియున్నదా

వోయీ మానవుడా

బుద్ధదేవుని భూమిలో పుట్టినావు

సహజమగు ప్రేమ నీలోన చచ్చేనేమి

అందమును హత్య చేసి హంతకుండా

మైలపడిపోయెనో నీ మనుజ జన్మ

అని దూషించు పూలకన్నియలకోయలేక

వట్టిచేతులతో వచ్చిన నాయీ హృదయ కుసుమాంజలి

గైకొని నాపై నీ రేఖలను కరుణశ్రీ

ప్రసరింపుము ప్రభు.

చేతులారంగ నిన్ను పూజించుకొరకు కోడి కూయంగనే మేలుకొంటి నేను గంగలో మున్గి ధౌత వల్కలము గట్టి పూలు కొనితేర నరిగితి పుష్పవనికి

నేనొక పూలమొక్క కడ నిల్చి చివాలున కొమ్మవంచి గో రానెడు నంతలోన విరులన్నియు జాలిగ నోళ్ళు విప్పి ‘మా ప్రాణము తీతువా’ యనుచు బావురు మన్నవి క్రుంగిపోతి నా మానసమందెదో తళుకు మన్నది పుష్పవిలాప కావ్యమై

తల్లి యొడిలోన తలిరాకు తల్పమందు ఆడుకొను మమ్ములను బుట్టలందు చిదిమి అమ్ముకొందువె మోక్ష విత్తమ్ము కొరకు! హృదయమే లేని నీ పూజ లెందుకోయి?

జడమతుల మేము జ్ఞానవంతుడవు నీవు బుద్ధి యున్నది భావ సమృద్ధి గలదు బండబారె నటోయి నీ గుండెకాయ! శివునకై పూయదే నాల్గు చిన్ని పూలు?

ఆయువు గల్గు నాల్గు గడియల్ కని పెంచిన తీపతల్లి జా తీయత దిద్ది తీర్తుము తదీయ కరమ్ములలోన స్వేచమై నూయల లూగుచున్ మురియుచుందుము ఆయువు దీరినంతనే హాయిగ కన్ను మూసెదము ఆయమ చల్లని కాలి వ్రేళ్ళపై

గాలిని గౌరవింతుము సుగంధము పూసి సమాశ్రయించు భృం గాలకు విందు చేసెదము కమ్మని తేనెలు మిమ్ము బోంట్ల నే త్రాలకు హాయిగూర్తుము స్వతంత్రుల మమ్ముల స్వార్థ బుద్ధితో తాళుము త్రుంపబోవకుము తల్లికి బిడ్డకు వేరు సేతువే!

ఆత్మ సుఖమ్ము కోసమయి అన్యుల గొంతులు కోసి తెచ్చు పు ణ్యాత్ముడ! నీకు మోక్ష మెటులబ్బును? నెత్తురు చేతి పూజ వి శ్వాత్ముడు స్వీకరించునె? చరాచరవర్తి ప్రభుండు మా పవి త్రాత్మల నందుకోడె! నడమంత్రపు నీ తగులాట మేటికిన్ ?

ఊలు దారాలతో గొంతు కురి బిగించి గుండెలో నుండి సూదులు గ్రుచ్చి కూర్చి ముడుచుకొందురు ముచ్చట ముడుల మమ్ము అకట! దయలేని వారు మీ యాడువారు

గుండె తడి లేక నూనెలో వండి పిండి అత్తరులు చేసి మా పేద నెత్తురులను కంపు దేహాలపై గుమాయింపు కొరకు పులుముకొందురు హంత! మీ కొలము వారు

అక్కట! హాయి మేము మహిషాసురు లెందరొ నాల్గు ప్రక్కలన్ ప్రక్కల మీద చల్లుకొని మా పసిమేనులు పాడు కాళ్ళతో ద్రొక్కుచు దొర్లి - దొర్లి - మరు రోజుదయాననె వాడి వత్తలై రెక్కలు జారిపోఁ పరిహరింతురు మమ్ముల పెంటదిబ్బ పై

మా వెలలేని ముగ్ధ సుకుమార సుగంధ మరంద మాధురీ జీవిత మెల్ల మీకయి త్యజించి కృశించి నశించిపోయె మా ౹ీవన మెల్ల కొల్లగొని ఆ పై చీపురుతోడ చిమ్మి మ మ్మావల పారవోతురు గదా! నరజాతికి నీతి యున్నదా !

బుద్ధ దేవుని భూమిలో పుట్టినావు సహజమగు ప్రేమ నీలోన చచ్చెనేమి? అందమును హత్య చేసెడి హంతకుండ! మైలపడిపోయెనోయి! నీ మనుజ జన్మ.

పూజ లేకున్న బాబు నీ పున్నె మాయె! కోయబోకుము మా పేద కుత్తుకలను అకట! చేసేత మమ్ముల హత్య చేసి బాపుకొన బోవు ఆ మహా భాగ్యమేమి?

ఇట్లు పుష్పాలు నన్ను చీవాట్లు పెట్టి నట్లుగాన్ - పూలు కోయ కేయాడలేదు ఏమి తోచక దేవర కెరుక సేయ వట్టి చేతులతో ఇటు వచ్చినాను

( కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి రచితం )

---